హామ్। యమస్త్వాం దక్షిణేపాయాత్ క్షురధారాభిమర్శనాత్॥ ౨॥ + యజ్ఞయ్యానామా ॥ త్రీన్ దర్భాన్ అంతర్ధాయ ॥ ఇతి దక్షిణతః॥ తాన్ కేశాన్నిధాయ ॥ అపఉపస్పృశ్య॥ శ్లో॥ పునరద్భిరుపస్పృశ్య పశ్చిమే ప్రకరోమ్యహామ్ । వరుణః పశ్చిమేపాయాత్ క్షురధారాభిమర్శనాత్॥ 3॥ ... యజ్ఞయ్యనామా॥ త్రీన్ దర్భాన్ అంతర్ధాయ॥ ఇతి పశ్చిమతః॥ తాన్ కేశాన్నిధాయ ॥ అపఉపస్పృశ్య॥ శ్లో॥పునరద్భిరుపస్పృశ్య చోత్తరే ప్రకరోమ్యహామ్ । ఓషధీశస్సదాపాయాత్ క్షురధారాభి మర్శనాత్॥ ౪॥ ...యజ్ఞయ్యనామా ॥ త్రీన్ దర్భాన్ అంతర్ధాయ॥ ఇత్యుత్తరతః॥ తాన్ కేశాన్నిధాయ॥ అపఉపస్పృశ్య॥ శ్లో॥ పునరద్భిరుపస్పృశ్య ఊర్ధ్వేతుప్రకరోమ్యహామ్ । విష్ణుస్త్వూర్ధ్వ సదాపాయాత్ క్షురధారాభి మర్శనాత్॥ ౫॥ ... క్షురంప్రక్షాళ్య॥ తతః కర్ణరంధ్రౌకృత్వా॥ శ్లో॥ వస్త్రేక్షురంసమాధాయ దీక్షామధ్యే నిధాయచ । చతుర్థదివసాదూర్ధ్వం నాపితాయప్రయచ్ఛతి॥ శ్లో॥సూనోర్మాతరి గర్భిణ్యాం చూడాకర్మనకారయేత్ । పంచమాసాదధః కుర్యాదత ఊర్ధ్వం నకారయేత్॥

ఉపనయనమ్॥ ఆచమ్య...ర్థం మమకుమారస్య ధర్మాధికార కర్మాధికార సిధ్యర్థమాయుస్తేజో శ్రీపుష్టికామ్యాభివృద్ధ్యర్థం మిమం కుమారం + గోత్రం + కుమారముపనయనం కరిష్యే ఇతిసంకల్ప్య॥ శుద్ధప్రదేశే అగ్నింప్రతిష్ఠాప్య॥ కౌపీనాచ్ఛన్నం కృతశౌచం కుమారం దక్షిణఉపవేశ్య ॥ స్వయముత్తరతః ॥ ఆచమ్య ... ఏవంగుణ శుభతిథౌ మమకుమారస్యా యుష్యాభివృద్ధ్యర్థం ఉపనయనాంగత్వేన కర్మాదౌరక్షార్థం రక్షాబంధనం కరిష్యామి॥ రక్షాబంధనదేవతాభ్యో నమః ॥ ధ్యానావాహనాది షోడశోపచారపూజాం సమర్పయామి॥ శ్లో॥ విశ్వేశ్వినా గ్రహాస్సర్వే ఇంద్రాద్యాదేవతాగణాః । కంకణం బంధయామ్యద్య వరస్యశుభదాభవేః॥రక్షాబంధనస్సుముహూర్తస్సు

ముహూర్తోఽస్తు ॥ ఆచమ్య ॥ ఏవం + శుభతిథౌ మమకుమారస్యా యుష్యాభివృద్ధ్యర్థం కర్మానుష్ఠానయోగ్యతా సిద్ధ్యర్థం పరమపవిత్ర యజ్ఞోపవీతధారణ మాచరిష్యే ॥ యజ్ఞోపవీత దేవతాభ్యో నమః ॥ ధ్యానావాహనాది షోడశోపచారపూజాః సమర్పయామి॥ సుజనాః యజ్ఞోపవీతం స్పృశేయుః ॥ఆచమ్య॥ కేశవాయనమః + శ్రీకృష్ణాయనమః॥ శ్లో॥ ఉపవీతం ధారయామి బ్రహ్మాదీనాం బలప్రదమ్। ఆయురారోగ్యపుష్ట్యాదివర్ధనం శుభవర్ధనమ్॥ శ్లో॥శుభ్రాం తేనవసూత్రంతు పవిత్రం పాపనాశనమ్ । ఆయుస్తేజోయశ స్సౌఖ్యం జ్ఞానకర్మశుభావహం॥ పునః ఆచమ్య ॥ కేశవాయనమః + శ్రీకృష్ణాయనమః॥ యజ్ఞోపవీతధారణ ముహూర్తస్సుముహూర్తోఽస్తు॥ అథ నాందీసమారాధనం కుర్యాత్ ॥ ఆచమ్య + ప్రీత్యర్థం మమకుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం ఉపనయనాంగభూతంనాంధీ శోభనదేవతా ప్రీత్యర్థం నాందీసమారాధన మాచరిష్యే ॥ తదంగత్వేన బ్రాహ్మణపూజాం కరిష్యామి॥ శ్రీమహావిష్ణు స్వరూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనం॥ సుఖాసనం॥ ఇదంపాద్యం॥ సుపాద్యం॥ శ్లో॥ నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే।సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీయుగధారిణేనమః ॥శ్రీమ[illegible] + అయంగంధః సుగంధః॥ గంధానాం + శోభనమస్తు॥ శ్లో॥శీతవాతోష్ణసంత్రాణం లజ్జాయాలక్షణంపరం దేహాలంకరణం వస్త్రమతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥ ఇతివస్త్రదానం దద్యాత్ ॥ తతఃయథాశక్తితాంబూలదక్షిణాదికందద్యాత్ ॥ ఏవంబ్రాహ్మణాన్ సంపూజ్య॥ [illegible]తః బ్రాహ్మణ భోజనార్థమామం వాహిరణ్యం వాదద్యాత్ ॥ ఏతత్ఫలం నాందీశోభన దేవతార్పణమస్తు ॥ మాత్రాసహకుమారం భోజనే పరివేషణా పోశన ప్రాణాహుతి సహితం క్షౌరలవణవర్జం కుమారం భోజయిత్వా॥ (లఘుభోజనం) శ్లో॥ కుమారలగ్న శాలేతుమహా

త్రాచ సహభోజనం। సప్రాణాహుతి మాసంచగురుర్మాణవకంవదేత్॥

అయ్యా! లఘుభోజనమునకు వీలుగలుగనిచో ఆసమయంబున తల్లిగారిచేత (మధువును=అనగా బెల్లమునుగాని తేనెనుగాని కుమారునికి యిప్పించవలెను.)పిమ్మట వటువు అద్రవ్యమును భక్షింపవలెను.

స్నాత్వాచమ్య॥ కుమారస్య శరీరశుద్ధ్యర్థం కర్మణః పుణ్యాహం కుర్యాత్॥ కర్మణఃపుణ్యాహం పూర్వముక్తం॥ ఉష్ణాశ్శీతాస్స్వపఆనీయ॥ శ్లో॥ ఉష్ణోదకేనప్లవనం పురతః ప్రకరోమ్యహం। సవితాపూర్వతః పాయాత్ క్షురధారాభి మర్శనాత్॥ ౧॥ ఉష్ణోదకంశీతోదకం నినీయ॥ జలేనపంచ శిఖస్థానాని సంస్పృశ్య॥ పంచదిశంప్రవపతి॥ యజ్ఞయ్యా నామా॥ ఇతిపూర్వతః॥ తాన్ కేశాన్ అన్యత్రనిధాయ॥ అపఉపస్పృశ్య॥ త్రీన్ దర్భాన్ అంతర్ధాయ॥ శ్లో॥ శీతోష్ణజలసంప్లావం దక్షిణే ప్రకరోమ్యహమ్। యమస్త్వాం దక్షిణేపాయాత్ క్షురధారాభిమర్శనాత్॥ ౨॥ ...యజ్ఞయ్యానామా॥ త్రీన్ దర్భాన్ అంతర్ధాయ॥ ఇతి దక్షిణతః॥ తాన్ కేశాన్ పూర్వస్థానేనిధాయ॥ అపఉపస్పృశ్య॥ శ్లో॥ పునరద్భిరుపస్పృశ్య పశ్చిమేప్రకరోమ్యహమ్। వరుణః పశ్చిమే పాయాత్ క్షురధారాభి మర్శనాత్॥ 3॥ యజ్ఞయ్యనామా॥ త్రీన్ దర్భాన్ అంతర్ధాయ॥ ఇతిపశ్చిమతః॥ తాన్ కేశాన్ పూర్వస్థానే నిధాయ॥ అపఉపస్పృశ్య॥ శ్లో॥ పునరద్భిరుపస్పృశ్యచోత్తరే ప్రకరోమ్యహం। ఓషదీశస్సదాపాయాత్ క్షురధారాభిమర్శనాత్॥ ౪॥ ...యజ్ఞయ్యనామా॥ త్రీన్ దర్భాన్ అంతర్ధాయ॥ ఇత్యుత్తరతః॥ తాన్ కేశాన్ పూర్వస్థానేనిధాయ॥ అపఉపస్పృశ్య॥ శ్లో॥ పునరద్భిరుపస్పృశ్య ఊర్ధ్వేతుప్రకరోమ్యహం। విష్ణుస్తూర్ధ్వేసదాపాయాత్ క్షురధారాభి మర్శనాత్॥ ౫॥ ...క్షురంప్రక్షాళ్య॥ నిధాయ॥ కుమారః స్నానంకుర్యాత్॥ ప్రతిష్ఠాగ్నింప్రజ్వాల్య॥అగ్నిసమీపేకుశాంబు కూర్చహస్తౌశ్చ దండాజినమేఖలానినిధాయ॥ విధిప్రకారేణ షట్పాత్ర

ప్రయోగం కుర్యాత్॥ ముఖాత్తీగ్నాత్వా॥ తతఃకుమారహస్తే ఏకసమిధం నిధాయ॥ అగ్నౌప్రహృత్య॥ శ్లో॥ అగ్నేత్వం ఘృతపృష్ఠోసి ఘృతేనపరివర్ధకః । రక్షేద్యథాపితాపుత్త్రం తద్వదాయుఃప్రదోభవ ॥ అగ్నయఇదం (నమమ) అథ ఉత్తరదేశేశ్యానమాస్థాప్య ॥ కుమారః సంస్పృశ్య॥ ఆచమ్య... ఏవంగుణ ... శుభతిథౌ మమకుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం శీతవాతోష్ణోప శమనద్వారా దేహాలంకరణార్థం నూతనవస్త్రాదిధారణంకరిష్యామి ॥ ఇతిసంకల్ప్య॥ శ్లో॥ కౌపీనాచ్ఛాదనంవస్త్రం ధారయామిసుప్రియమ్ । శీతవాతోష్ణసంత్రాణం లజ్జాకార్పణ్యహారకమ్ ॥ ఇతి కౌపీనవస్త్రధారణంధృత్వా॥ తతః దండధారణం కరిష్యామి ॥ శ్లో ॥ ఆయుర్వర్చోయశస్సంఘ ద్బలపుష్టిప్రవర్ధన । దండత్వాంధారయామ్యద్యగోవ్యాఘ్రాదిభయాపహ॥ తతఃఅజిన ధారణం కేచిత్ నకుర్వంతి॥ తత్కారణెసూర్యనారాయణాయనమయితిపాఠః॥ సూర్యనారాయణాయనమః॥ఇతిపఠిత్వా॥తతఃసూర్యదర్శనమ్॥ శ్లో॥ దర్శనంప్రకరోమ్యద్య బ్రహ్మతేజోవివృద్ధయే। సూర్యస్యతేజశ్శౌర్యాది వృద్ధిదంబలవర్ధనమ్ ॥ తతఃకుమారస్య సకృద్దక్షిణహస్తంగృహీత్వా॥ దేవాయసవిత్రేనమః॥ తతః దేవతాప్రార్థనంకుర్యాత్ ॥ అగ్నయేనమః॥ సోమాయనమః॥ సవిత్రేనమః॥సరస్వత్యైనమః॥పూష్ణేనమః॥బృహస్పతయేనమః॥అర్యమాయనమః॥సూర్యాయనమః॥భగాయనమః॥మిత్రాయనమః॥ ధర్మాధికారోభవయితిఆచార్యః॥ అగ్నయేనమ ఇతిదేవతాభ్యోరక్షణాయదత్వా॥అగ్నయేనమఃయజ్ఞయ్యనామక ॥ సోమాయనమః + నామక ॥ సవిత్రేనమః ... నామక ॥ సరస్వత్యైనమః...నామక ॥ మృత్యవేనమః...నామక॥ యమాయనమః...నామక॥ గదాయనమః...నామక ॥ అంతకాయనమః...నామక ॥ అద్భ్యోనమః ... నామక ॥ ఓషధీభ్యోనమః...నామక ॥ పృథివ్యైనమః ...నామక ॥ తతస్సుముహూర్తే ॥ స్వస్త్యస్తుశీతి సహస్రాణాంద్విజగురు దైవత్యా

నాం ... ...మ్సుప్రీతాస్సుముహూర్తాస్సుప్రసన్నా వరదాభవంతు॥ బ్రహ్మాదీనామితిదక్షిణేకర్ణేజపతి॥ శ్లో॥ బ్రహ్మాదీనామపిపరః కథమాత్మాసదాశుచిః । ఇమంమాణవకంచాద్య రక్షేత్సర్వప్రకాశకః॥ తతః నవగ్రహహోమం ఆచార్యః కుర్యాత్ ॥ తతఃఇంద్రాయనమః॥అగ్ని వరుణసోమాయనమః ॥ విశ్వేభ్యోదేవేభ్యోనమః ॥ ఇతికుమారః ॥ తతః అష్టదిక్పాలకహోమంకరిష్యామి॥ అగ్నయేనమః...ఈశానాయనమః ॥ తతః కేశవాదిహోమంకుర్యాత్ ॥ కేశవాయనమః...శ్రీకృష్ణాయనమః ॥ తతః గాయత్ర్యుపదేశమ్ ॥ శ్లో ॥ గాయంతంసర్వదారక్షే స్సంధ్యాహ్నే రుద్రరూపిణీ। సాయాహ్నే వైష్ణవీప్రోక్త ర్బ్రహ్మణీసందిశేచ్ఛుభమ్ ॥ ధ్యానం ॥ పంచశీర్షాందశభుజాం షట్కుక్షీం వేదమాతరం । త్రిమూర్తిజననీమం బాంగాయత్రీంత్రి పదాంభజే॥ యోదేవస్సహితాస్మాకం । ధియోధర్మాదిగోచరాః । ప్రేరయేత్తస్య యద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే ॥ ప్రాతర్మధ్యాహ్న సంధ్యాసు త్రిమూర్త్యామ్నాయ మాతృకే। చతుర్వింశద్వర్ణ రూపీగాయత్రీభాస్వతేనమః॥ గాయత్ర్యుపదేశముహూర్త + ర్తోఽస్తు॥ ఆచమ్య + ఏవం గుణ + శుభతిథౌ మమఆయుర్బలాభి వృద్ధ్యర్థం గోసర్పభయనివృత్త్యర్థం దేవతాప్రార్థనం కరిష్యామి॥ శ్లో॥ఆయుర్వర్చో యశస్సంపద్బల పుష్టిప్రవర్ధన। దండత్వాం ధారయామ్యద్యగోవ్యాఘ్రాది భయాపహ॥ జపాకుసుమసంకాశం + కేతుంచప్రణమామ్యహం ॥ యితి దేవతాప్రార్థనం కృత్వా॥ గురోవరంతేదదామీతి గురవేవటుర్వరంగాం దద్యాత్॥ తతః గురుపూజాంచ కారయేత్॥ శ్లో॥ దేవస్యప్రీతయేదానం గృహ్ణామ్యర్యమతుష్టయే। బాహుభ్యాం పుష్టహస్తాభ్యాం పుణ్యకర్మప్రసూతయే॥ ఇతిమంత్రేణగాంగురవేదద్యాత్ ॥ గాంప్రతిగృహ్ణాతు॥ తతః గురునమస్కారః ॥శ్లో॥ ఆపత్యగుణరత్నాయ కర్మసాక్షిర్జగద్గురో । జగచ్చక్షుర్జగన్నాధరవయే బ్రహ్మణేనమః॥ మిత్రత్వమసి

విశ్వాత్మన్ మిత్రత్వంధారయే స్మమ। ద్యాంసూర్యదేవతా మిత్రమిత్ర రూపనమోస్తుతే॥ ఇతిసూర్యప్రార్థనం కృత్వా ॥ తతః దక్షిణహస్తం గృహీత్వా॥ దేవేభ్యోనమః ॥ యజ్ఞయ్యనామన్ ॥ అగ్నికార్యమ్॥ ఆచమ్య + ఏవంగుణ + శుభతిథౌ శ్రీమాన్గోత్రః + నామధేయోఽహం మమదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం ఆయుర్బలాభివృద్ధ్యర్థం ప్రాతరగ్నికార్య మాచరిష్యే॥ శ్లో॥ మత్కర్మసఫలం కుర్యాత్ పావకో దేవహవ్యవాట్। సర్వదాశుచిరవ్యగ్రామేమారూఢస్తుపావక॥ పరిమృజ్యాలంకృత్య ॥ పూర్వపరిషేచనంనమః ॥ దక్షిణ పరిషేచనంనమః॥ పశ్చిమపరిషేచనంనమః ॥ ఉత్తరపరిషేచనంనమః॥ అశ్వత్థసమిధమాదాయ॥ శ్లో॥ అగ్నేత్వాం పరితోమృజ్మిధనాయుర్బలదోయతః। ప్రదిశత్వంమమాయుష్య పుష్టివీర్యయశస్సుఖమ్॥ అగ్నయేనమః॥ శ్లో॥ అగ్నేత్వయిప్రక్షిపామి సమిధంచాతిపావనమ్॥ అగ్నయేనమః ॥ యథాసమిద్భిర్జ్వలసపవం మామాయుషాయుజ ॥ అగ్నయేనమః ॥ వర్చసామేధయాచైవ ప్రజయాచసమేధయ ॥ అగ్నయే నమః॥ యతఃప్రకాశకోహ్యగ్నే మాంచైవాశుప్రకాశయ॥ అగ్నయే నమః॥ సమిద్రూపస్త్వమేవాసి మాంచైవాశుసమేధయ ॥ అగ్నయే నమః ॥ తేజస్త్వం సర్వదేవానాం మయితేజోవివర్ధయ ॥ అగ్నయే నమః॥ మేధాదేవీలోకమాతా ఇంద్రోమేధాందదాతుమే॥ ఇంద్రాయ నమః॥ అగ్నయేనమః॥ యమాయనమః ॥ నిరృుతయేనమః ॥ వరుణాయనమః ॥ వాయవ్యేనమః ॥ కుబేరాయనమః ఈశానాయనమః॥ ప్రజాపతయేనమః॥ (అగ్న్యుపస్థానం) అగ్నిశ్శ్రద్ధామయోదేవః హవిష్యందత్తిశ్రద్ధయా । శ్రద్ధావేద మయీసాతొచ్ఛ్రిద్ధాలోకైకపావనీ॥ మేధాదేవీలోకమాతా ఇంద్రోమేధాం దదాతుమే ॥ భస్మనాశిరోలలాట వక్షస్స్కంధేషు తిలకాని కుర్యాత్ ॥ భూతింభ్యూతికరీ పవిత్రజననీపాపంచ విధ్వంసినీ । చిత్తానందకరీయశస్సుఖకరీసర్వార్థ సంప

త్కరీ । రక్షోభూతపిశాచ రాక్షస మహారక్షైకసంత్రాసినీ । తేజో రాజ్య విశేషపుణ్యజననీ భూతిస్సదాధార్యతామ్ ॥ మేధావీ తేజస్వీ వర్చస్వీతి అగ్నింప్రార్థయేత్ ॥అగ్న యేవసునీథాయనమః॥ శ్లో॥ నమస్తే యజ్ఞభోక్త్రేచ నమస్తే హవ్యవాహన । నమస్తే వీతిహోత్రాయ సప్తజిహ్వాయ తేనమః॥ గోవిందపుండరీకాక్ష యజ్ఞేశాచ్యుతమాధవ। రామకృష్ణహృషీకేశ నారాయణ నమోస్తుతే ॥ స్థాణుః శంభుః శివ శ్శూలీశర్వ ఈశానశంకరః । పినాకీచంద్రచూడశ్చ సదాశివ నమోస్తుతే ॥ చతుస్సాగరపర్యంతం మదీయం + కులంశుభంభవతు ఋషేయప్రవరాన్విత। + గోత్రః + నామధేయః అహంభోఅభివాదయే॥ ఇత్యగ్ని కార్యమ్॥ ఆచార్యః భిక్షాచర్యంచర॥ తథాకరోమి ॥ తతః ఆచార్యాధీనోభవ తథాకరోమి ॥ తతోగురుంమాతరమన్యాశ్చ వృద్ధాన్న మస్కుర్యాత్ ॥ చతుస్సాగరపర్యంతం + శుభంభవతు॥ భవాన్భిక్షాం దదాత్వితి పురుషం ॥ భవతీభిక్షాం దేహీతిస్త్రియం యాచయేత ॥ నమోనమఃఇతివటురాదిత్య ముపస్థాయ॥ ఆశీర్వాదః॥ ఇత్యుపనయనమ్॥

ఈఉపనయన ప్రయోగంబున హోమాదులయందు కొందరు నమశ్శబ్దమును మఱికొందఱు స్వాహాశబ్దమును ఉపయోగించుదురు దేశాచారవ్యవస్థలను విచారించి ప్రయోగమును జర్పింపదగును యీఉపనయనము వేదోక్తవిధిగా ఆచరించువారలకుగాదు కేవలము పురాణోక్తమే కావలెనని అపేక్షించువారలే గ్రహింపఁదగును వేదోక్తమే కావలయునని కోరువారలకు నాచే ముద్రింపఁబడిన యాజుష స్మార్తానుక్రమణికయను గ్రంథముజూడఁదగును.

ఉపనయనమ్ - సమాప్తమ్.

---

## అథ పాలాశప్రయోగః.

చతుర్థేఽహనిపూర్వాహ్ణే స్నాత్వాఽచమ్య సంధ్యావంద నాదికంకృత్వా ॥ అశ్వత్థ వృక్షప్రదేశే అలంకృత్య ॥ శ్లో॥ శుక్లాంబ రధరం + సర్వేభ్యో మహాజనేభ్యోనమః ॥ ఆచమ్య + ఏవంగుణ + శుభతిథౌ మమకుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం మేధాజననసిద్ధ్యర్థం పాలాశకర్మ కరిష్యమాణ స్తదంగత్వేన తదాదౌ + పుణ్యాహవాచ నంకరిష్యామి ॥ ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధి పతిపూజాంకరిష్యామి ॥ గణాధిపతిపూజాం పుణ్యాహవాచనంచకు ర్యాత్ ॥ ఆచమ్య + ఏవంగుణ + శుభతిథౌ మమకుమారస్యాయు ష్యాభివృద్ధ్యర్థం మేధాజననసిద్ధ్యర్థం పాలాశాఖ్యంకర్మకరిష్యే॥ ఏత ద్వృక్షమూలే నూతనవస్త్రానినిధాయ ॥ గణపతి మావాహయామి స్థా + మి॥ శ్లో॥ ఛందసామృషభోదేవో విశ్వరూపధరోయతః।అమృ తాచ్చైవఛందోభ్య స్సంబభూవదయానిధిః ॥ ప్రణవ మావాహయా మి స్థా + మి॥ శ్లో॥ అగ్నిశ్శ్రద్ధామయోదేవః హావిర్విందతిశ్రద్ధయా। శ్రద్ధావేదమయీసాతు చ్ఛ్రిద్ధాలోకైకపావనీ ॥ శ్రద్ధామావాహ యామి స్థా + మి ॥ శ్లో॥ మేధాదేవీలోకమాతా ఇంద్రోమేధాంద దాతుమే ॥ మేధామావాహయామి స్థా + మి॥ శ్లో ॥ అశ్వత్థస్సర్వ వృక్షాణా మగ్రణీః పూజ్యతామియాత్ । అశ్వత్థాయ నమస్కుర్వే బలపుష్టివివృద్ధయే॥ అశ్వత్థనారాయణ మావాహయామి స్థా + మి॥ తతః ఇంద్రాద్యష్ట దిక్పాలకానావాహ్య ॥ విధిప్రకారేణ ఆవాహనం కుర్యాత్ ॥ ప్రణవశ్రద్ధామేధాదేవతాభ్యోనమః ॥ ఇంద్రాద్యష్టది క్పాలక దేవతాభ్యోనమః ॥ ధ్యానావాహనాది షోడశోపచార పూ జాంసమర్పయామి ॥ ఆచమ్య + + ర్థం పాలాశహోమంకరిష్యామి॥ విధిప్రకారేణ పట్పాత్రప్రయోగంకుర్యాత్ ॥ శ్లో ॥ ఛందసామృష భోదేవో విశ్వరూపధరోయతః । అమృతాచ్చైవఛందోభ్య స్సంబ

భూవదయానిధిః ॥ ఛందో భ్యాఇదంవమమ॥ శ్లో॥ అగ్నిశ్రద్ధామయో దేవః హవిర్విందతిశ్రద్ధయా । శ్రద్ధా వేదమయీసాతు చ్ఛ్రిద్ధాలో కైకపావనీ ॥ ఛందో + నమమ ॥ శ్లో ॥ మేధా దేవీలోకమాతా ఇం ద్రోమేధాందదాతుమే ॥ ఛందో + నమమ ॥ శ్లో ॥ అశ్వత్థస్సర్వ వృక్షాణా మగ్రగణీఃపూజ్యతామియాత్ । అశ్వత్థాయనమస్కుర్వే బలపుష్టివివృద్ధయే ॥ ఛందో + నమమ ॥ తతః కేశవాది హోమం కుర్యాత్ ॥ కేశవాయనమః + శ్రీకృష్ణాయనమః ॥ + + బ్రహ్మ త్వపూజానంతరే దీక్షావస్త్రదండాదీన్ నిధాయ॥: విసర్జనం॥ శ్లో॥ ప్రవి శంతుయథాస్థానంమిత్రాద్యా దేవతాగణాః।యదాహ్వానమహంకుర్వే శోభనాగమనాయచ ॥ ఇతి విసర్జనం కృత్వా ॥ అన్యానినూతన వ స్త్రాణిధారయేత్ ॥ ఆశీర్వాదః॥

ఇతిపాలాశ కర్మప్రయోగ [illegible]మాప్తః. త॥ త॥ నా॥ సీ॥

---

మహాలయప్రకరణమ్.

ఆదౌపితాతథామాతా సాపత్నీజననీతథా । మాతామహా స్సపత్నీకా ఆత్మపత్నీ స్త్వనంతరం ॥ సుతభ్రాతృపితృవ్యాశ్చమాతు లాస్సహభార్యకాః । దుహితాభగినీచైవ దౌహిత్రోభాగినేయకః। పితృష్వసామాతృష్వసాజామాతా భావుకస్స్నుషా । శ్వశురస్సా శ్య లకశ్చైవ స్వామినోగురురిక్థినః॥

పితౄణాంపశ్చిమేభాగే మాతృపిండం యథాక్రమం।మాతా మహాశ్చతత్పూర్వం । ఆత్మపత్న్యస్తదుత్తరమ్। సుతభ్రాతృ పితృ వ్యాశ్చ మాతాపితోశ్చ మధ్యమే । మాతామహ మహీమధ్యే మాతులా స్సహభార్యకాః । దుహితాదితతోన్యేషాం శేషందక్షిణ తో విధిః॥ పుంపిండంవామతః స్త్రీణాంతత్పూత్రంసముపస్థితం। అంగుష్ఠ పరిమాణంతు గోత్రమన్యం నసంస్పృశేత్। నిరాశాః పితరోయాంతి విపరీతోభివేద్యది॥

ఏవంగుణ * పుణ్యతిథౌ యజమానస్య పితృపితామహ ప్రపి తామహానాం గోత్రాణాం + నాం రూపాణాం ॥ మాతృపితామహీప్రపితామహీనాం గోత్రాణాం...నాం రూపాణాం ॥ సాపత్నీమాతుః...గోత్రాయాః + రూపాయాః ॥ మాతామహమాతుః పితామహమాతుః ప్రపితామహానాం — గోత్రాణాం + నాం రూపాణాం॥ మాతామహీ మాతుః పితామహీమాతుః ప్రపితామహీనాం గోత్రాణాం ...ణాం । ఆత్మపత్న్యాః గోత్రాయాః...సుతస్య గోత్రస్య + వసురూపస్య భ్రాతుః గోత్రస్య వసురూపస్య॥ పితృవ్యస్య గోత్రస్య + వసురూపస్య। మాతులస్య + గోత్రస్య + వసురూపస్య। దుహితుః గోత్రాయాః + వసురూపాయాః । ఆత్మభగిన్యాః గోత్రాయాః వసురూపాయాః । దౌహిత్రస్య గోత్రస్య వసురూపస్య। భాగినేయస్య గోత్రస్య...స్య । పితృష్వసుః గోత్రాయాః వసురూపాయాః । మాతృష్వసుః గోత్రాయాః*యాః। జామాతుః గోత్రస్య...స్య। భావుకస్యగోత్రస్య*స్య స్నుషాయాఃగోత్రాయాః...యాః। శ్వశురస్యగోత్రస్య...స్య॥శ్వశ్రాః గోత్రాయాః—యాః । స్యాలకస్యగోత్రస్య...స్య॥స్వామినఃగురోః రిక్థినః ధూర్విలోచన సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాంచ కన్యాగతేసవితరి అషాఢ్యాదిపంచమాపరపక్షేకర్తవ్యసకృన్మహాలయాఖ్యామశ్రాద్ధం సదైవంసపిండం పార్వణవిధినా సద్యః కరిష్యేనమః॥ కాలేఅధికారసిద్ధ్యర్థం యథాశక్తిసంభవత్ప్రాయశ్చిత్తం కరిష్యామినమః॥ శ్లో॥ సమస్త...పదం॥పూర్వమాబ్దిక ప్రకరణోక్తరీత్యా శేషంశ్రాద్ధంకర్తవ్యం ॥ కారుణ్యవిషయేప్యేవం॥ఊహాస్థలేష్విశ్రాద్ధప్రకరణోక్తరీతి రేవానుసంధేయావిస్తరభయాన్నలిఖ్యతే॥

## హిరణ్యశ్రాద్ధమ్.

ఏవం ... తిథౌ యజమానస్య పితృపితామహ ప్రపితామహానాంగోత్రాణాం ... రూపాణాం । మాతృపితామహీ ప్రపితామహీ

నాం గోత్రాణాం ... మాతామహ మాతుః పితామహ మాతుః ప్రపితామహానాం గోత్రాణాం... సపత్నీకానాం ధనురుచి సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం। మకరసంక్రమణాదిశ్రాద్ధప్రతినిధిహిరణ్యశ్రాద్ధం హిరణ్యద్రవ్యేణ సంకల్పవిధానేన యుష్మదనుజ్ఞయాసదైవం అద్యకరిష్యామినమః॥ కాలే అధికారసిద్ధ్యర్థం యథాశక్తిసంభవత్ప్రాయశ్చిత్తం కరిష్యామినమః ॥ శ్లో॥ సమస్త...పదం ॥ యజమానస్య పిత్రాదీనాం హిరణ్యశ్రాద్ధే అధికార సిద్ధిరస్త్వితి భవంతో బ్రువంతు। అధికార ... స్తు ॥ దేవతాభ్యః పితృ ... సదాశివః ॥ ధనురుచి సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం స్థానే క్షణందదామి ॥ పితృ పితామహా...ణాం సపత్నీకానాం స్థానేక్షణందదామి॥ మాతామహమాతుః పితామహమాతుః ప్రపితామహానాం గోత్రాణాం ... ణాం సపత్నీకానాం స్థానేక్షణందదామి॥ అక్రోధనైః శౌచపరైః... కరిష్యే॥ ఆచమ్య ఏవం ... తిథౌమకరసంక్రమణ శ్రాద్ధప్రతినిధి హిరణ్య శ్రాద్ధే యుష్మదనుజ్ఞయాహిరణ్యశ్రాద్ధకర్మకరిష్యామినమః॥ తిలారక్షంత్వ... రక్షకః ॥ తిలాన్ వికిరేత్ ॥ ధనురుచిసం... నామిదమాసనంనమః ॥ ఇదం తేక్షణం దదామినమః ॥ ధనురు...వాః అమీవోగంధాః।సుగంధాః। ధనురు...వాః। ఇమానిపుష్పాణినమః । ధనురు...వాః అయం వోధూపః॥ సుధూపః॥ ధనురు...వాః అయంవోదీపః ॥ సుదీపః। శీతవా...మే॥ధనురు + వాసః। సువాసః॥తదభావేసాక్షతా ఇమేకుశాః_ సుకుశాః (ప్రాచీనావీతీ) పిత్రాద్యర్చనం కరిష్యామినమః పితృపితామహ ప్రపితామహానా మిదమాసనంనమః। ఇదం తేక్షణంనమః॥ పితృ ...ణాం సపత్నీకానాం అమీవోగంధాః। సుగంధాః। ఇమానిపుష్పాణినమః అయంవోధూపః - అయంవోదీపః । శీతవాతో...మే॥ ఇదం వోవాసః_ సువాసః ॥ తదభావే సతిలాఇమేకుశాః - యజమానస్య మాతామహాద్యర్చనం కరిష్యామినమః ॥ మాతామహా...ణాంసపత్నీకానా మిదమాసనంనమః ॥ సంక్రమణశ్రాద్ధ ప్రతినిధిహిరణ్యశ్రాద్ధే క్షణందదామినమః ॥ మాతామహా...ణాం సపత్నీకానాం అమీవో గంధాః ॥ మాతామహా...ఇమానిపుష్పాణినమః ॥ ఏవంధూపదీపః

సతిలాఇమేకుశాః ఇతిఅర్చనం సంపూర్ణం యుష్మదనుజ్ఞయామండ లోద్వర్తనం కరిష్యామినమః ॥ తత్తత్స్థానేషు హిరణ్యం నిధాయ ॥ శ్రీవిష్ణోహిరణ్యం రక్షస్వధనురుచి...వాః ఇదంవోహిరణ్యం సపరికరం గయేయం భూర్గదాధరోభోక్తా అహంబ్రహ్మాగృహీతా బ్రహ్మాబ్రహ్మ రూపం హిరణ్యంమనః కల్పితసావర్ణపాత్రస్థ మక్షయ్యవటచ్ఛాయా స్థం-ధనురుచి సంజ్ఞకేభ్యో విశ్వేభ్యో దేవేభ్యః । అక్షయ్యతృప్త్యర్థం సంప్రదదేనమమ । ఇదంహిరణ్యం అమృతరూపేణ సంపద్యం తాం హవ్యంనమః ॥ కాశ్యాం విశ్వేశ్వర...మస్తు ॥ గయాగదాధరః ప్రీతో భవతు ॥ హిరణ్యం బ్రాహ్మణాయదద్యాత్ ॥ ప్రాచీనావీతీ॥ శ్రీవిష్ణో హిరణ్యంరక్షస్వ పితృపితా...హాస్సపత్నీకాః ఇదరివోహిరణ్యం సప రికరం పితృ పితామహా ... హాః గోత్రాః + + సపత్నీకాః వసు రుద్రాదిత్య రుపాదేవాదేవతా ఇదంహిరణ్యం గయేయంభూర్గదాధరో భోక్తాఅహం బ్రహ్మాగృహీతా...కల్పితరజితపాత్రస్థం పితృపితా...రూ పేభ్యః అక్షయ్య తృప్త్యర్థం...నమమ । ఇదంహిరణ్యం అమృతరూ పేణ సంపద్యతాం కవ్యం నమః ॥ కాశ్యాంవిశ్వే ... అస్తు ॥ గయాగ దాధరః ప్రీతోభవతు ॥ ఏవం మాతామహస్థానేత్యంతం కుర్యాత్ ॥ సప్తవ్యాధా...పితౄణాం దత్తమక్షయం ॥ గయహిరణ్యదాన కల్పే + మస్తు॥ నివీతీ ॥ ఈశానవిష్ణు...హేతూన్ ॥ ఆచమ్య - ఏవం... తిథౌ + పితృ...రూపాన్ సపత్నీకాన్ మాతామహ...రూపాన్ సపత్నీ కాన్ । ధనురు...కాన్ విశ్వాన్ దేవానుద్దిశ్య సంక్రమణశ్రాద్ధప్రతినిధి హిరణ్య శ్రాద్ధేన పితృపితా...ణాం సపత్నీకానాం మాతామహ... ణాంసపత్నీకానాం గయాహిరణ్యదానకల్పోక్త సంపూర్ణ సకలఫలా వాప్తిరస్త్వితి భవంతో బ్రువంతు॥ గయా...రస్తు॥ తతః హిరణ్యంబ్రా హ్మణాయదద్యాత్ ॥శ్లో॥ భవిష్యద్విష్టరంపాద్య మర్ఘ్యమావాహనం తథా । అనలంవికిరంపిండం హైమేచాష్టవిసర్జయేత్ ॥

సంకల్పశ్రాద్ధం గ్రంథవిస్తరభయాత్ నలిఖ్యతే॥

హిరణ్యశ్రాద్ధం సమాప్తమ్.

శ్రీకృష్ణఃకమలానాథో వాసుదేవస్సనాతనః । వసుదేవాత్మజఃపుణ్యో లీలామానుషవిగ్రహః॥ ౧ ॥ శ్రీవత్సకౌస్తుభధరో యశోదావత్సలోహరిః । చతుర్భుజాత్తచక్రాసి గదా శంఖాంబుజాయుధః॥ ౨॥ దేవకీనందనఃశ్రీశో నందగోపప్రియాత్మజః । యమునావేగసంహారీ బలభద్రప్రియానుజః॥ 3 ॥ పూతనాజీవితహర శ్శకటాసురభంజనః । నందవ్రజచరానందీ సచ్చిదానందవిగ్రహః ॥ ౪ ॥ నవనీతవిలిప్తాంగో నవనీతనటోనఘః। నవనీతినవాహారీముచి కుందప్రసాదకః ॥ ౫ ॥ షోడశస్త్రీసహస్రేశః త్రిభంగీమధురాకృతిః । శుకవాగమృతాబ్ధీందుగ్గోవిందోయోగినాంపతిః ॥ ౬ ॥ వత్సవాటచరోనంతో ధేనుకాసురభంజనః । తృణీకృతతృణావర్తో యమళార్జునభంజనః ॥ ౭ ॥ ఉత్తాలతాలభేత్తాచ తమాలశ్యామలాకృతిః । గోపగోపీశ్వరోయోగీ కోటిసూర్యసమప్రభః ॥ ౮ ॥ ఇళాపతిఃపరంజ్యోతి ర్యాదవేంద్రోయదూద్వహః । వనమాలీపీతవాసాః పారిజాతాపహారకః ॥ ౯ ॥ గోవర్ధనాచలోద్ధర్తా గోపాలస్సర్వపాలకః । అజోనిరంజనఃకామ జనకఃకంజలోచనః ॥ ౧౦ ॥ మధుహామధురానాథో ద్వారకానాయకోబలీ। బృందావనాంతసంచారీ తులసీదామభూషణః॥౧౧॥శ్యమంతకమణేర్హర్తా నరనారాయణాత్మకః।కుబ్జాకృష్ణాంబరధరో మాయీపరమపూరుషః॥ ౧౨॥ ముష్టికాసుర చాణూరమల్లయుద్ధవిశారదః। సంసారవైరీకంసారీమురారిర్నరకాంతకః॥ ౧3॥ అనాదిబ్రహ్మచారీచ కృష్ణావ్యసనకర్శకః । శిశుపాలశిరశ్ఛేత్తా దుర్యోధనకులాంతకః॥ ౧౪ విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః । సత్యవాక్సత్య సంకల్పఃసత్యభామారతోజయీ॥ ౧౫॥ సుభద్రాపూర్వజో విష్ణుర్భీష్మముక్తిప్రదాయకః । జగద్గురుర్జగన్నాథో వేణునాదవిశారదః॥ ౧౬॥ వృషభాసురవి

ధ్వంసీ బాణాసురకరాంతకః । యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హిబర్హావతంసకః॥ ౧౭॥ పార్థసారథిరవ్యక్తో గీతామృతమహోదధిః । కాళీయఫణిమాణిక్యరంజిత శ్రీపదాంబుజః॥ ౧౮॥ దామోదరోయజ్ఞభోక్తాదానవేంద్ర వినాశకః । నారాయణః పరబ్రహ్మ పన్నగాశనవాహనః॥ ౧౯॥ జలక్రీడాసమాసక్త గోపీవస్త్రాపహారకః । పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యోదయానిధిః॥ ౨౦॥ సర్వతీర్థాత్మక స్సర్వగ్రహరూపీ పరాత్పరః। ఏవం శ్రీకృష్ణదేవస్య నామ్నామష్టోత్తరంశతం॥ ౨౧॥ కృష్ణనామామృతం నామపరమానందకారకం। అత్యుపద్రవదోషఘ్నం పరమాయుష్యవర్ధనం॥ ౨౨॥**** ****

ఇతి శ్రీకృష్ణాష్టోత్తరంసంపూర్ణమ్.

---



31

# ఆశౌచప్రకరణము.

ఆశౌచస్వరూపము—స్మృతిచంద్రికాయాం॥ సపిండాదిజననే మరణేవాసతి యదప్రాశస్త్యం దానాదికర్మస్వయోగ్యతా పాదకం పాపవిశేషాత్మకంవా తదాశౌచశబ్దేనబోధ్యతే॥

తా॥ జ్ఞాతులు మొదలగువారి జననమరణములవలన గలిగెడి, మైలగాని, దానాదికర్మంబులయందు అనర్హత్వమును సూచెంచెడి పాపవిశేషంబుగాని, ఆశౌచమనఁబడును.

## ఆశౌచేవర్జనీయకృత్యాని.

శ్లో॥ ఆశౌచేవర్జయేత్కర్మ నిత్యనైమిత్తికాదికం।
ఆశౌచినస్తథాస్పర్శం స్పృష్ట్వాస్నానేనశుద్ధ్యతి॥

తా॥ ఆశౌచమునందు నిత్యనైమిత్తికాది క్రియలను చేయకూడదు. ఇతరులను తాకకూడదు. ఆశౌచముగలవారిని తాకినవారు స్నానముచే బరిశుద్ధులగుదురు.

## ఆశౌచభేదములు.

వా॥ తచ్చాశౌచం ద్వివిధంజాతకం మృతకంచేతి॥

తా॥ అట్టియాశౌచము-జాతాశౌచము- (పురుడు) మృతాశౌచము(సూతకము) అని రెండువిధములు.

వా॥ తత్ర ప్రథమం స్రావపాత ప్రసూతిభేదేన త్రివిధం॥

తా॥ స్రావాశౌచము - పాతాశౌచము - ప్రసూత్యాశౌచము - అని జాతాశౌచము మూడువిధంబులు.

శ్లో॥ ఆచతుర్థాద్భవేత్స్రావః పాతఃపంచమషష్ఠయోః।
అతఊర్ధ్వం ప్రసూతిస్స్యాద్దశాహంసూతకంభవేత్॥

తా॥ గర్భిణీస్త్రీకి నాలుగుమాసములలోపల గర్భముపోయినయెడల స్రావమనఁబడును. ఐదవ ఆఱవమాసమునందు పోయినయెడల పాతమనఁబడును. ఏడవమాసము మొదలుకొని ప్రసవమనఁబడును.

శ్లో॥ స్రావేమాతుస్త్రిరాత్రంస్యా త్సపిండాశౌచవర్జనం।
పాతేమాతుర్యథామాసం పిత్రాదీనాందినత్రయమ్॥

తా॥ మూడు నెలలలోపల గర్భస్రావము కలిగిన మూడుదినములును, నాలుగవ నెలయందు కలిగిన, నాలుగు దినములును తల్లికి ఆశౌచము తండ్రికిస్నానముమాత్రము నాలవమాసమున్నకతినముగ స్రావమైనయెడ తండ్రికి మూడుదినములును సహోదర భార్యలకు స్నానముమాత్రము జ్ఞాతుల కేమియులేదు మృదుస్రావమైనయెడ తండ్రి-సోదరులు జ్ఞాతుల్ను వీరలకు స్నానముమాత్రము చెప్పఁబడినది. గర్భపాతసమయమున నెన్నిమాసములో అన్నిదినములు తల్లికిని తండ్రికిని సోదరులకునుజ్ఞాతులకును మూడు దినములు ఆశౌచము, గ్రామాంతరమునందు గర్భపాతము కలిగినయెడ తండ్రి మొదలగు వారికి స్నానముమాత్రము.

సపిండాదుల జాతాశౌచ నిర్ణయము.

ప్రసూతౌతు సపిండానాం పూర్ణాశౌచముదీరితం। ఏకోదకానాం త్రిదినంసగోత్రాణాం నకించన । స్త్రీపుంస ప్రసవేమాతు ర్మాసోవింశత్యహః క్రమాత్॥ అస్పృశ్యత్వంతునైవాస్తి సూతకేసూతికాంవినా । శావాశౌచేతుసర్వేషా మస్పృశ్యత్వం సదాభవేత్। సూతకీమృతకీచైవ నస్పృశేతాంపరస్పరం॥

తా॥ జాతాశౌచము సపిండులకు (జ్ఞాతులకు) పదిదినములును ఏకోదకులకు మూడుదినములును ఆశౌచము సగోత్రులకు ఆశౌచములేదు. స్త్రీనిప్రసవించినపుడు తల్లికొక మాసమును పుత్రుని ప్రసవించునపుడు ఇరువదిదినములును ఆశౌచము కావున అలోపల నన్నికర్మల జేయజనదు. పురుటియందు, ప్రసవించిన స్త్రీ దప్ప ఆశౌచము గలవారిని ఇతరులుతాకినను దోషములేదు. (పుత్రుడు జన్మించిన వెనుక సచేలస్నానము చేయువఱకు తండ్రినితాకగూడదు.) ప్రసవించిన స్త్రీకి దగ్గరకుగూడ పోదగిన అత్యంతాశౌచము పదిదినములు - మృతాశౌచముగలవారిని తాకగూడదు సూతకము గలవాడును పురుడు గలవాడును ఒకరినొకరు తాకగూడదు.

కించ॥ శ్లో॥ జాతేపుత్రేపితుస్స్నానం సచేలంతువిధీయతే॥

తా॥ పుత్త్రుడు బుట్టగానే తండ్రి సచేలస్నానము జేయవలెనుట - ఇక్కడ బుత్రపదము గన్యయు గ్రహింపఁబడును.

## సపిండాది స్వరూపము.

వా॥ పితృపితామహప్రపితామహాదయస్సప్తపూర్వాః పురుషాః, పుత్రపౌత్రాదయస్సప్తాపరాః పురుషాస్సపిండా ఇత్యుచ్యంతే। సంతానభేదేపియతః ప్రభృతిద్వావా బహవోవాసంతానాః ప్రవృత్తాస్సకూటస్థః। కూటస్థప్రభృతి గణితానా నాసంతానవర్తినో ప్యేకగోత్రాను ప్రవిష్టాస్సప్త పూరుషాః పరస్పరంసపిండాః॥ అష్టమప్రభృతి చతుర్దశపర్యంతా ఏకగోత్రానుప్రవిష్టా స్సమానోదకాః। పంచదశప్రభృతి ఏకవింశతిపర్యంతాస్సగోత్రాః॥

తా॥ ఒక పురుషునికి ఇద్దరుగాని బహుమందిగాని జనించినయెడవారిపరంపరకు ఆపురుషుడు కూటస్థుడగును అట్టికూటస్థుడు మొదలుకొని పుత్రపౌత్రాది క్రమమున నేడుగురివఱకును పితృపితామహాది క్రమముగ నేడుగురివఱకును పరస్పరము సపిండు లనఁబడుదురు. ఎనిమిదవ పురుషుడు మొదలుకొని పదునాలుగవ పురుషునివఱకు సమానోదకు లనఁబడుదురు. అటుపిమ్మట ఇరువదియొక పురుషునివఱకు సగోత్రు లనఁబడుదురు.

వా॥ అనూఢాస్త్రీయస్తు కూటస్థప్రభృతిత్రిపూరుష పర్యంతా స్సపిండాః॥ తతస్త్రిపూరుష పర్యంతాస్సమానోదకాః। సప్తమ ప్రభృతిసగోత్రాః॥

తా॥ పెండ్లి కాని స్త్రీలు కూటస్థుడాదిగాగల ముగ్గురివఱకును సపిండలనఁబడుదురు. నాలవవాడు మొదలుకొని ముగ్గురివఱకును సమానోదకులు - అవలసగోత్రు లనఁబడుదురు.

## చాతుర్వర్ణ్యాశౌచ నిర్ణయము.

వా॥ బ్రాహ్మణస్య సపిండానాం జననమరణయోర్దశాహమాశౌచం ద్వాదశాహం రాజన్యస్య పంచదశాహం వైశ్యస్యమాసం శూద్రస్య॥

తా॥ సపిండులలో జననమరణాశౌచములు వచ్చినపుడు బ్రాహ్మణులు పది దినములును క్షత్రియులు ౧౨ దినములును వైశ్యులు ౧౫ దినములును శూద్రులు ౩౦ దినములును ఆశౌచము నవలంబించవలయు.

యాజ్ఞవల్క్యస్మృతియందు, శ్లో॥ త్రింశద్దినానిశూద్రస్య తదర్ధంన్యాయవర్తినః॥

తా॥ పంచయజ్ఞాదికర్మలు చేయుచున్న సచ్ఛూద్రులకు పదునైదు దినములని చెప్పఁబడినది.

పితృగృహమున పుత్రికప్రసవించినపుడు.

వా॥ పితృగృహేపుత్రికా* ప్రసూతాచేన్మాతా పితృభ్రాతౄణాంత్రిరాత్రం। జ్ఞాతీనామేకరాత్రం॥

తా॥ పితృగృహంబున బుత్రిక పుత్రిని ప్రసవించినయెడల తల్లితండ్రి అన్నదమ్ములు వీరికి మూఁడుదినములును, వారిజ్ఞాతుల కొక్కదినంబును, ఆశౌచము, ఇతరగృహమునందు బ్రసవించినయెడ గర్భిణియొక్క తలిదండ్రులకులేదు. ఇతరగృహమునందు బ్రసవించినపుడు పురిటికర్యెడి వెచ్చమును తండ్రియొసంగినయెడ మూఁడుదినములు ఆశౌచము కలదు.

వా॥ కన్యాజననేతు పక్షిణ్యాశౌచం। కిమపినాస్తీతి కేచిత్॥

తా॥ స్త్రీనిగనినయెడల ఒకటిన్నరదినము- అదియులేదని కొందరుబుధులుచెప్పిరి.

దూరశ్రుత జాతాశౌచము.

వా॥ దూరవృత్తం పుత్రజననం జ్ఞాతిజననంవాదశాహమధ్యే శ్రుతంచేద్దశాహశేషేణైవశుద్ధిః। దశాహాదూర్ధ్వం శ్రుతంచేత్పితుస్సచేలస్నానమాత్రం। భ్రాతౄణాం జ్ఞాతీనాం కిమపినాస్తి। సమానోదకానాంతు త్రిరాత్రమధ్యే జననశ్రవణేత్రిరాత్రశేషేణశుద్ధిః। తదూర్ధ్వం శ్రవణేకిమపినాస్తి॥

తా॥ పుత్రజననమునుగాని జ్ఞాతిజననమునుగాని పరదేశమునందుండి పదిదినములలోపల వినినయెడల అందుశేషించిన దినములకు పురుడుపట్టవలెను. పదిదినములకుమీద వినినయెడ తండ్రికిసచేలస్నానము మాత్రము. అతనిభ్రాతలకు జ్ఞాతులకును అదియుబనిలేదు - ఏకోదకులు మూఁడుదినములలోపల వినినయెడ అందుశేషించిన దినములకు మాత్రము ఆశౌచముపట్టవలెను అటుపిమ్మట వినినయెడ ఆశౌచమేలేదు.

శిశుమరణమునందు.

వా॥ జాతస్యశిశోర్నాభిచ్ఛేదాత్పూర్వం మరణేమాతుర్దశరాత్రంజాతాశౌచం। పిత్రాదీనాంసర్వేషాంత్రిరాత్రం జాతాశౌచం

దశరాత్రంవా। మత్పృకాశౌచంతు స్నానమాత్రాన్నివర్తతే ॥ నాభి చ్ఛేదాదూర్ధ్వంమరణే మాతాపితృ భ్రాతౄణాం జన్మదినాహశ్శేష పర్యంతంమృతకాశౌచం। జ్ఞాతీనాందశరాత్రం జాతాశౌచమేవ॥

తా॥ నాభిచ్ఛేదనమునకు బూర్వము శిశువు మృతిబొందినయెడ తల్లికి పదిదిన ములు పురుడుండును.పితృసోదర జ్ఞాతులకు 3 దినములు జాతాశౌచము.!పదిదినములని కొందరు వచించిరి. మరణాశౌచము స్నానముతోనే నివర్తించును. నాభిచ్ఛేదనా నంతరము పదిదినములలోపల నేదినమునందు శిశువు మరణించినను, శేషించినదినములకు, మాత్రము తలిదండ్రులకు సోదరులకు మరణాశౌచమున్నది జ్ఞాతులకు లుపదిది ముజా తాశౌచము మృతాశౌచము స్నానముతో వదలును.

వా॥ మృతప్రసవేమాతుర్దశరాత్రం మృతకాశౌచం।
పిత్రాదీనాంసర్వేషాం దశరాత్రం జాతాశౌచమేవ॥

తా॥ మృతశిశుజననమునందు పదిదినములు తల్లికి సూతకము పిత్రాదిజ్ఞాతులకు జాతాశౌచము మాత్రముపదిదినములుండును. మృతాశౌచముస్నానముతోనివర్తించును

వా॥ ద్రావిడానాంతు కన్యాజననే మాతాపితృభ్రాతౄణాం పితృవ్య తత్పుత్రయోః పితామహతద్భ్రాత్రోశ్చాశౌచం అన్యేషాం కిమపినాస్తి । పితృవ్యోభిన్నోదరశ్చేత్తస్యైవాశౌచం । తత్పుత్రస్యాశౌచంనాస్తి । సూతికాయాస్త్రీప్రసవేచత్వారింశద్దినాన్యాశౌచం పుంప్రసవే మాసమాశౌచం॥

తా॥ ద్రావిడులకు స్త్రీసంతానము గలిగినపుడు తల్లితండ్రి అన్నదమ్ములు పిన తండ్రి వారిపుత్రులు తాతలు పినతాతలు వీరలకుదప్ప నితరులకు జాతాశౌచము లేదు భిన్నోదరుడగు పినతండ్రియొక్క కొడుకులకును ఆశౌచములేదు. స్త్రీప్రసవమునందు నలువదిదినములును, పుంప్రసవమునందు ముప్పదిదినములును తల్లికి జాతాశౌచము.

వా॥ పితృగృహేపుత్రీప్రసూతా చేత్తన్మాతా పిత్రోస్త్రిరాత్రం తద్భ్రాతుకేకరాత్రం । జ్ఞాతీనాంకిమపినాస్తి॥

తా॥ తండ్రియింట ప్రసవించినయెడ తల్లితండ్రులకు మూడుదినములును అన్న దమ్ములకొకదినంబును ఆశౌచముగలదు జ్ఞాతులకేమియులేదు.

వా॥ దశాహమధ్యేశిశుమరణే మాతాపిత్రోర్దశాహ శేషపర్యంతం మృతకాశౌచం । భ్రాతుర్జాతాశౌచమేవ । దశమదినేశిశు

మరణే మాతాపిత్రోర్దశాహాదూర్ధ్వం ద్విరాత్రం। తస్మిన్నేవదినేఅష్ట మయామే శిశుమరణే త్రిరాత్రం । అన్యత్సర్వంసమానం॥

తా॥ పదిదినములలోపల శిశువుమరణించినయెడ పుట్టినదినము మొదలుకొని పదిదినములవఱకు తల్లిదండ్రులకు మృతాశౌచము అన్నదమ్ములకు పురుడుమాత్రముం డును. పదియవనాడు శిశువుమరణించినయెడ, పిదప రెండుదినములాశౌచము పట్టవల యు, పదియవదినమునందెనిమిదవ జామున శిశువు మరణించినయెడ మూడుదినములా శౌచము, మిగిలినదంతయు సమానము-

---

## అనుపనీతమరణము.

శ్లో॥ అర్వాగుపనయాత్పిత్రోర్భ్రాతౄణాంచ దినత్రయం । అర్వాగ్దంతోద్గమాచ్చాలా త్తథోపనయనాత్క్రమాత్ । సద్యోదినం త్రిరాత్రంచ సపిండానాం ప్రకీర్తితం। దహనేతు త్రిరాత్రంస్యాదాశౌచమపిగోత్రిణాం । అజాతదంతదహనే త్యాగేచైకాహముచ్యతే।అతిక్రాంతంతూపనయాదర్వాఙ్నాస్త్యేవకస్యచిత్ ॥

తా. ఉపనయనము కాకమునుపు బాలుడు మరణించినయెడ మాతాపితృ భ్రాతలకు జ్ఞాతులకు మూడుదినములు ఆశౌచము - దంతములు రాకమునుపు శిశువు మరణించినయెడ జ్ఞాతులకు స్నానముతో సరి. పుట్టువెంట్రుకలు తీయకముందైన యెడ నొకదినము ఉపనయనము కాకముందైనయెడల మూడుదినములును జ్ఞాతుల కా శౌచముగలదు. అనుపనీతమృత శిశువును దహనముచేసినపక్షమున మూడుదినములును పండ్లు రాకమునుపు దహనముగాని త్యాగమునుగాని చేసినపుడు ఒక్కదినమును జ్ఞాతులకాశౌచము. అనుపనీత మరణమునందు కాలాంతరాశౌచము పిత్రాదిజ్ఞాతుల కం దరకు లేనేలేదు. అనుపనీతునికి దహనాది సంస్కారములను దేశాచారము ననుసరిం చి చేయవలయు.

---

## కన్యామరణము.

శ్లో॥ అనూఢాయామృతౌపిత్రోర్భ్రాతౄణాంచదినత్రయం।
దినమాదంతజననా దితిధర్మవిదోవిదుః।

శ్లో॥ జ్ఞాతీనాంస్నానమాచౌలా దావాగ్దానాద్దినంభవేత్।
వాగ్దానేతుత్రిరాత్రంస్యా త్పితృభర్తృకులద్వయోః।
అనూఢాచేద్దశఃపశ్చా ద్దశాహంతన్మృతౌభవేత్॥

తా॥ పెండ్లిగాని కన్యక మరణించినపుడు మాతాపితృభ్రాతలకు మూడుదినములాశౌచము. దంతములు రాకముందైనయెడ నొక్కదినంబని కొందరు వచించిరి. దంతములు వచ్చినతరువాత చౌలకర్మకాకమునుపు మరణించినయెడ జ్ఞాతులకు స్నానముతోసరి. చౌలకర్మఅయినది మొదలుకొనిగాని, మూడవసంవత్సరము మొదలుకొనిగాని, వాగ్దానములోపల మరణించెనేని జ్ఞాతులనొక్కదినంబును. వాగ్దానము మొదలు వివాహములోపల మరణించెనేని తండ్రివంకవారికిని పెనిమిటివంకవారికిని మూడుదినములాశౌచము. పెండ్లికాకమునుపు రజస్వలలై మరణించినయెడల నందరికిని పదిదినములాశౌచము.

## ఉ ప నీ త మృ తా శౌ చ ము.

శ్లో॥ ఉపనీతమృతౌపూర్ణం సర్వేషాంమృతకంభవేత్।
ఏకోదకానాంత్రిదినం సగోత్రాణాంతుమజ్జనమ్॥

తా॥ ఉపనీతుడు మరణించినయెడ పిత్రాదులకు సపిండులకు సంపూర్ణాశౌచము - సమానోదకులకు మూడుదినములు సూతకము - సగోత్రులకు స్నానముతోసరి. అనుపనీతుడు మరణించినపుడును వివాహముకాని కన్యక మరణించినపుడును, వివాహముకానివారు మరణించినపుడును సమానోదకులకు స్నానముతోసరి.

---

## మా తా మ హ్యా ది మ ర ణ ము.

వా॥ మాతామహీ మాతామహ మాతృష్వసృమాతుల మాతులానీ దౌహిత్రభాగినేయానాం సన్నిధానమరణేత్రిరాత్రం।అసన్నిధానేపక్షిణీ॥

తా॥ అమ్మమ్మ, అమ్మతండ్రి, పినతల్లి, పెదతల్లి, మేనమామ, అతనిపెండ్లాము, కూతురుకొడుకు, మేనల్లుడు, వీరు మరణించినపుడు మూడుదినములు, దేశాంతరమునందుండి వినినయెడల ౧౪ దినము సూతకము.

## శ్వశ్రూశ్వశురమరణము,

వా॥ శ్వశ్రూశ్వశురయోస్సన్నిధానే జీవద్భార్యస్య జామాతుస్త్రిరాత్రం, అసన్నిధానే పక్షిణి। మృతభార్యస్య జామాతుస్సన్నిధానేప్యేకరాత్రం। భార్యాసంతతౌ స్థితాయాంతు త్రిరాత్రం॥

తా॥ భార్యయుండు నపుడు అత్తమామలు మరణించినయెడ మూడుదినములు, దేశాంతరమున వినినయెడల ౧½ దినము, అత్తమామలు సమీపమునందు మరణించినపుడు అపత్నీకునకు ఒక్కరాత్రిసూతకము, భార్యయున్నను లేకున్నను సంతానముండినయెడల మూడుదినములు సూతకము.

## ఆచార్యాది మరణము.

వా॥ ఆచార్య తత్పుత్రతత్పత్నీనాం మరణే సన్నిధానే త్రిరాత్రం అసన్నిధానే పక్షిణీ। శిష్యస్యసన్నిధానమరణే ఆచార్యాదీనామప్యేవమేవ॥

తా॥ గురువు - గురుపుత్రుడు - గురుభార్య వీరలు మరణించినపుడు శిష్యునకు మూడుదినములు సూతకము - దేశాంతరమున వినినయెడ ౧½ దినము - శిష్యుని మరణము నందాచార్యాదులకును నైప్రకారమేసూతకము.

## పుత్రీ మరణము.

వా॥ వివాహాదూర్ధ్వం పితృగృహేపుత్రీమరణే మాతాపితృభ్రాతౄణా మనూఢభగినీనాంచ త్రిరాత్రం। జ్ఞాతీనామేక రాత్రం భ్రాతృపత్నీనాం స్నానమాత్రం॥ ద్రావిడానాంతు మాతాపిత్రోస్త్రిరాత్రం భ్రాతృభగినీనామేకరాత్రం జ్ఞాతీనాం కిమపినాస్తి॥

తా॥ వివాహితస్త్రీ, తండ్రియింట మరణించినపుడు తల్లితండ్రి అన్నదమ్ములు పెండ్లి కానిచెల్లెండ్రు వీరలకు మూడుదినములు, దాయాదులకు ఒకదినమును సూతకము. అన్నదమ్ముల భార్యలకు స్నానముతో సరి. ద్రావిడులలో తలిదండ్రులకు మూడుదినములు, అన్నదమ్ములకు చెల్లెండ్రకు నొక్కదినము, దాయాదుల కేమియులేదు.

వా॥ యదిమాతా పితృభ్రాతరో విభక్తాభిన్న గృహవాసినశ్చేత్పితృగృహేమరణే పిత్రోరేవత్రిరాత్రం। భ్రాతృగృహే చేద్భ్రాతురేవత్రిరాత్రం। జ్ఞాతిగృహేచేత్తేషామేకరాత్రం। అన్యత్ర మరణే మాతా పితృభ్రాతౄణాం పక్షిణీ జ్ఞాతీనాంకిమపినాస్తి॥

తా॥ పితాపుత్రులు విభక్తులై వేర్వేరు గృహమునందుండి నపుడు ఎవరియింట మరణించునో వారికి మూడుదినములు సూతకము. తక్కినవారికి ఒకదినము. జ్ఞాతుల యింట మరణించినపుడు పిత్రాదుల కొక్కదినమును జ్ఞాతులకు మూడుదినములును అన్యగ్రామమున జరిగినయెడ మాతాపితృభ్రాతలకు ౧౹ దినము జ్ఞాతులకేమియు లేదు

## మాతాపితృ మరణము.

వా॥ స్వగృహే పరగృహేవామాతా పిత్రోర్మరణే పుత్ర్యా స్త్రిరాత్రం॥

తా॥ తలిదండ్రులు ఎక్కడమరణించినను కూతురికిమూడుదినములు సూతకము.

## సహోదర మరణము.

వా॥ భగినీగృహే భ్రాతృమరణే భగిన్యాస్త్రిరాత్రం పరగృహేపక్షిణీ । గ్రామాంతరే త్వేకరాత్రం॥

తా॥ సోదరమరణము చెల్లెలింట జరిగినపుడు చెల్లెలికి మూడుదినములు, ఇతర గృహంబున జరిగినయెడ చెల్లెలికి ౧౺ దినము దేశాంతరము నందైనయెడ నొక్కదినము సూతకము.

## స్యాలాది మరణము.

శ్లో॥ భగినీపతేస్తు స్వగృహేపరగృహేవాస్యాలమరణే ఏకరాత్రం । స్యాలపుత్రమరణేప్యేకరాత్రం॥

తా॥ భార్యయొక్క అన్నదమ్ముల మరణమునందును వారిపుత్రుల మరణమునందును, ఒక్కదినము సూతకము. గ్రామాంతరంబున జరిగినయెడ స్నానముతోసరి.

## అనుపనీత భ్రాత్రాదిమరణము.

వా॥ అనుపనీత భ్రాతృమరణే సన్నిధానేపి భగిన్యాస్నానమాత్రం । భ్రాతృపుత్రమరణేప్యేవమేవ॥

తా॥ ఒడుగుగాని తమ్ముడు మేనల్లుడు వీరు ఏకగ్రామంబున మరణించినపుడు స్త్రీకి స్నానముతోసరి.

## భ గి నీ మ ర ణ ము.

వా॥ భ్రాతృగృహే భగినీమరణే భ్రాతుస్త్రిరాత్రం । పరగృహే పక్షిణీ । గ్రామాంతరే ఏకరాత్రమ్॥

తా॥ చెల్లెలి మరణము అన్నదమ్ముల యింట జరిగినయెడ వారికి మూడుదినము లును ఇతరుని యింటజరిగిన ౧౪ దినమును, ఇతరదేశంబున జరిగిన నొక్కదినంబును ఆశౌచము.

## దత్తపుత్రమరణము.

వా॥ దత్తపుత్రమరణే పూర్వాపర పిత్రోస్తత్పుత్రాణాంచ త్రిరాత్రం । అసన్నిధానే త్వేకరాత్రం । పితృద్వయజ్ఞాతీనాం సన్నిధానేచైకరాత్రం । అసన్నిధానే స్నానమాత్రం। అనుపనీతదత్తపుత్రమరణేతు సన్నిధానేపి స్నానమాత్రం। దత్తస్యపుత్రజననే మరణేవా ఉపనయనాత్పరమపి జనకవర్గస్య స్నానమాత్రం। దత్తస్య జనకపితృమరణేత్రిరాత్రం। ప్రతిగృహీతృపితృమరణే దశరాత్రంతన్మరణె ప్రతిగృహీతురపిదశరాత్రం । యదిదత్తస్యౌరసానంతరం జాతఔరసపుత్రస్సంస్కర్తాతదాదత్తస్య త్రిరాత్రమేవ॥

తా॥ అనుపనీతదత్తపుత్ర మరణమునందు జనకతండ్రికి పెంపుడుతండ్రికి వానిపుత్రులకును మూడుదినములాశౌచము. దేశాంతరమునందైనయెడల నొకదినము ఉభయజ్ఞాతులకు సమీపమునందొక్కరాత్రి, దూరపుజ్ఞాతులకు స్నానముతోసరి - దత్తపుత్రుడుపనయనముగాక సమీపమున మరణమునొందినను జ్ఞాతులకు స్నానముతోసరి. దత్తునకు పుత్రుడుపుట్టినను ఉపనీతుడై మరణించినను జనకపితృసంబంధిజ్ఞాతులకు స్నానముతోసరి, జనకపితృమరణమునందు దత్తపుత్రునకు మూడుదినములు సూతకము. ఉపనీతుడగు దత్తుడుగాని ప్రతిగృహీతగాని మరణించినపుడు పరస్పరము పదిదినములాశౌచము. దత్తతజరిగినపిదప ఔరసపుత్రుడు కలిగి కర్మలనడుపుచుండు నపుడు పితృమరణమునందు దత్తునకు మూడుదినములు సూతకము.

---

## ఆత్మబంధ్వాది మరణము.

వా॥ ఆత్మబంధూనాం మాతృబంధూనాం పితృబంధూనాంచ మరణె సన్నిధానేపక్షిణీ । అసన్నిధానె త్వేకరాత్రం॥

తా॥ ఆత్మబంధువులు - పితృబంధువులు - మాతృబంధువులు - వీరలు దగ్గర మరణించినపుడు ౧౪ దినము. దేశాంతరమునందు జరిగినయెడ ఒకదినము సూతకము

## సాపత్నీయ మాతృవర్గమరణము.

వా॥ సాపత్నీయ మాతృవర్గ మాతులాదేర్మరణె సన్నిధానే ఏకరాత్రం। అసన్నిధానే స్నానమాత్రమ్॥

తా॥ సవతితల్లి సహోదరులు మొదలగువారు మరణించినపుడు సమీపమునం దొకదినము దేశాంతరమునందైనయెడ స్నానముతోసరి.

## దత్తప్రతిగృహీతృ వర్గమాతులాది మరణము.

వా॥ దత్తస్య ప్రతిగృహీతృ వర్గస్య మాతులా దేర్మరణె దత్తస్య సన్నిధానే ఏకరాత్రం అసన్నిధానే స్నానమాత్రం - దత్తజనకవర్గస్య మాతులాదేర్మరణెసన్నిధానే ఏకరాత్రం॥

తా॥ పెంపుడుతల్లి యొక్క అన్నదమ్ములు మొదలగువారు మరణించినపుడు దత్తపుత్రునకు సమీపమునందొక దినము, అన్యగ్రామమునందు స్నానముతోసరి, దత్తునకు జనకతల్లి యన్నదమ్ములు మరణించినప్పుడు ఒక్కదినము సూతకము, ఇతర గ్రామమునందు స్నానముతోసరి.

---

## సపత్నీపుత్రాది మరణమునందు.

వా॥ సపత్నీపుత్రీమరణె సాపత్న్యమాతు రేకరాత్రం।మాతృసపత్నీమరణెసపత్నీపుత్ర్యా అప్యేకరాత్రంఅసన్నిధానేస్నానమాత్రం॥

తా॥ సవతికూతురు మరణించినపుడు సవతితల్లికి ఒకదినము, సవతితల్లిపోయినపుడు సవతికూతురికి ఒకదినము, దూరమునందైనయెడ స్నానముతోసరి.

## అసపిండ మరణమునందు.

వా॥ దౌహిత్రభాగినే యవ్యతిరిక్తానా మసపిండానా ముపనయనాత్పూర్వంమరణె సన్నిధానేపి స్నానమాత్రం। దౌహిత్రభాగినేయయోస్తు ప్రాగుపనయ నాన్మరణెపక్షిణీ। తదూర్ధ్వంత్రిరాత్రం చౌలాత్పూర్వంతు స్నానమాత్రం॥

తా॥ దౌహిత్రుడు మేనల్లుడు వీరలుదక్క తక్కిన యనుపనీతులగు అసపిండులు సమీపమున మరణించిన స్నానముతోసరి. దౌహిత్రుడు, మేనల్లుడు, వీరు అను

నీతులై మరణించినపుడు ౧౪ దినము, ఉపనీతులైనయెడ త్రిరాత్రము, చౌలముగాక మరణించినపుడు స్నానముతోసరి.

వా॥ మాతృష్వసాదీనామసపిండస్త్రీణాం వివాహాత్పూర్వంమరణౌసన్నిధానేపిస్నానమాత్రం॥

తా॥ అసపిండులగు పినతల్లి మొదలగు స్త్రీలు అవివాహితలై దగ్గరమరణించినను స్నానముతోసరి.

జామాతృ మరణమునందు.

వా॥ జామాతృమరణౌ సన్నిధానేపక్షిణీ । అసన్నిధానేప్యేకరాత్రం తస్యైవస్వగృహే మరణౌత్రిరాత్రం॥

తా॥ అల్లునిమరణము సమీపమున జరిగిన ౧౪ దినము, దూరమున జరిగిన నొకదినము. తనయింట మరణించినయెడ మామకు మూడుదినములు సూతకము.

వా॥ యోనిసంబంధేషు యేయేపురుషాస్తత్పత్నీనాం మరణౌ సన్నిధానేపి స్నానమాత్రం । మాతులాన్యాస్తు విశేషవిధానాత్ త్రిరాత్రం । యోనిసంబంధేషు యాస్త్రియస్తద్భర్తృ మరణేపి స్నానమాత్రం॥

తా॥ యోనిసంబంధముగల పురుషులయొక్క భార్యలును, అట్టి స్త్రీలయొక్క భర్తలును మరణించినప్పుడు స్నానముతోసరిపోవును. మేనమామభార్యమరణించినపుడు మూడుదినము లుండవలెను.

గురుశిష్యులకు.

వా॥ జప్యమంత్రోపదేష్టరిమృతే.సన్నిధానేఏకరాత్రం । అసన్నిధానే సజ్యోతిః, తచ్ఛిష్యమృతౌ తస్యాపితథైవ॥

తా॥ మంత్రోపదేశము నొనర్చినగురువు సమీపమున మరణించినపుడు శిష్యునకొకరాత్రి సూతకము. దూరమునందైనయెడ విన్నదిమొదలు దీపమును జూచువరకు సూతకము. శిష్యుడు మరణించినపుడు గురువునకు నాప్రకారమేయగును.

వా॥ పరిణీతానాంస్త్రీణాం మాతాపితృ భాతృతత్పుత్రాన్వినాపితృవర్గ బంధుమరణౌ స్నానమాత్రమితిధర్మ ప్రవృత్త్యనుసారిణ

ఆంధ్రాదయః । ఇతరేతుపక్షిణ్యాదిక మాచరంతి । ద్రావిడాస్తుసర్వ-సాధారణ్యేన పరిణీతాస్త్రియ స్తత్ప్రతి యోగినశ్చ పక్షిణ్యాదిక మాచరంతి॥

తా॥ పెండ్లి అయినస్త్రీలు మాతాపితృభ్రాతృ తత్పుత్రులకు దప్పతక్కిన పితృవర్గ బంధువుల మరణమునందు స్నానమాత్రము నాచరింపవలయునని ధర్మప్రవృత్తి యందు జెప్పబడినది. కొందరుపక్షిణ్యాద్యాశౌచము నవలంబించుచున్నారు. ద్రావిడులలో విశేషముగా వివాహితస్త్రీలువారి ప్రతియోగినులును ఒకరికొకరు పక్షిణ్యాద్యాశౌచమును పట్టుచున్నారు.

అతిక్రాంతాశౌచనిరూపణము.

శ్లో॥ తత్తదాశౌచమాఖ్యాత మతిక్రాంతమనేకధా ।

తా॥ జ్ఞాతుల మరణకాలమును అతిక్రమించి వినినప్పుడట్టి సూతక మనేక విధములగును.

వా॥ జ్ఞాతీనాం మరణం దశాహమధ్యే శ్రుతంచేద్ద శాహశే షేణశుద్ధిః। దశాహాదూర్ధ్వంతు మాసత్రయమధ్యేత్రిరాత్రం। తతష్షణ్మాస మధ్యేపక్షిణీ । తతస్సంవత్సరపర్యంత మేకరాత్రం సంవత్సరా దూర్ధ్వంతు స్నానమాత్రం । నవమాసాదూర్ధ్వం స్నానమాత్ర మిత్యేకే॥

తా॥ మరణించిన దినము మొదలుకొని పదిదినములలోపల జ్ఞాతిమరణ వృత్తాంతమును వినినయెడ శేషించిన దినములయందు సూతకము పట్టవలెను. పదిదినములుగడచినవెనుక మూడు నెలలలోపల వినినయెడ మూడు దినములును అటుపైని ఆరునెలలలోపల వినినయెడ ౧౺ దినము, అటుతరువాత సంవత్సరము ముగియులోపల వినినయెడ నొకరాత్రియు, సూతకము, సంవత్సరముఅయిన పిదప స్నానముతోసరి. మరణించిన తొమ్మిదిమాసములకుపైన వినినయెడ స్నానమాత్రమని కొందఱు.

వా॥ త్రిరాత్రాశౌచినాం మరణం త్రిరాత్రమధ్యేశ్రుతం చేత్తచ్ఛేషేణశుద్ధిః । త్రిరాత్రేతిక్రాంతే స్నానమాత్రం॥

తా॥ త్రిరాత్ర సూతకముగలవారు మూడు దినములలోపల వినినయెడల శేషించిన దినములయందు సూతకముపట్టవలెను, మూడుదినములు అయినపిమ్మట వినినయెడ స్నానముతోసరి.

వా॥ పక్షిణ్యాశౌచినాంతు మరణం పక్షిణీమధ్యే శ్రుతంచేత్త చ్ఛేషేణశుద్ధిః। పక్షిణీకాలేఽతిక్రాంతేస్నానమాత్రం। యావజ్జీవంప క్షిణీత్యేకే॥

తా॥ పక్షిణ్యాశౌచముగలవారు పక్షిణీమధ్యమున వినినయెడ మిగిలిన దినము లందు సూతకము పట్టవలెను, అటుపిమ్మట వినినయెడ స్నానముతోసరి, ఎప్పుడు విని నను ౧౪ దినము పట్టవలెననికొందఱు.

సూ॥ ఏకరాత్రాశౌచినామేకరాత్రేతిక్రాంతే స్నానమాత్రం॥

తా॥ ఏకరాత్రాశౌచము గలవారు, ఒకరాత్రి అయిన వెనుక వినినయెడస్నా నముమాత్రము జేయవలయు.

వా॥ మాతాపిత్రు విషయేదత్తకన్యాయా దశాహాభ్యంతరేత్రి రాత్రం। తదూర్ధ్వంపక్షిణీతి ధర్మప్రవృత్త్యనుసారిణః త్రిరాత్రేతి క్రాంతే స్నానమిత్యన్యే॥

తా॥ వివాహితస్త్రీ తల్లిదండ్రుల మరణవార్తను ౧౦ దినముల లోపల వినిన యెడ మూడు దినములు సూతకముపట్టవలెను, అటుపిమ్మట వినినయెడ ౧౪ దినము అని ధర్మప్రవృత్తియందు జెప్పబడినది, మరణించినపిమ్మట మూడుదినములకు పైన వినినయెడ స్నానము మాత్రమని కొందఱు.

వా॥ పుత్రికాభగినీ భ్రాతృవిషయే తత్ప్రతియోగినాం దశా హాభ్యంతరేపక్షిణీ। తదూర్ధ్వమేకరాత్రమితి ధర్మప్రవృత్తిపక్షః। యావజ్జీవంపక్షిణీత్యపరః పక్షః। పక్షిణీకాలేఽతీతే స్నానమితితృతీయః॥

తా॥ కూతురు - చెల్లెలు - అన్నదమ్ములు వీరు మరణించినపుడు వారి ప్రతి యోగినులకు పదిదినములలోపల పక్షిణ్యాశౌచము - అటుపిమ్మట వినినయెడ ఒక్క రాత్రియని ధర్మప్రవృత్తియందు జెప్పబడినది. ఎప్పుడు వినినను పక్షిణియని కొంద ఱుచెప్పిరి. పక్షిణ్యాశౌచము పట్టదగిన కాలమతిక్రమించినయెడ స్నానముతోసరి అని మఱికొందఱు చెప్పిరి.

ప్రతియోగినుల స్వరూపము.

శ్లో॥ మాతృష్వస్రుసుతాపుత్రో పితృష్వస్రుసుతస్త్రియా।
స్వసాపితృవ్యపుత్రీచ స్వస్రుపుత్రీపితృష్వసా।

భ్రాతృపుత్రీచ దౌహిత్రీ పౌత్రీతత్ప్రతియోగినాం।
స్త్రీపుంసాచక్వచిత్స్యాత్తే పక్షిణ్యాశౌచినామిధః॥

తా॥ పెద్దతల్లి యొక్క పుత్రీపుత్రులును పినతల్లియొక్క పుత్రీపుత్రులును ఒకరికొకరు ప్రతియోగినులగుదురు. మేనత్త యొక్క పుత్రీపుత్రులును, మేనమామ యొక్క పుత్రీపుత్రులును ఒకరికొకరు ప్రతియోగినులు, చెల్లెలికి - అక్క - అన్న - అక్కకు - చెల్లెలు తమ్ముడు ప్రతియోగినులు - పినతండ్రి కూతురికి పెదతండ్రి పుత్రీపుత్రులు ప్రతియోగినులు: మేనకోడలికి పినతల్లి మేనమామ వీరలు ప్రతియోగినులు మేనత్తను, మేనల్లుడు వీరు ప్రతియోగినులు భ్రాతృపుత్రికకు మేనత్త పినతండ్రి పెదతండ్రులు ప్రతియోగినులు, దౌహిత్రురాలికి తల్లి తల్లి, తల్లితండ్రి ప్రతియోగినులు, మనుమరాలికి తండ్రితల్లి తాత వీరు ప్రతియోగినులగుదురు, వీరలు మరణించినపుడు పగస్వగము ౧1 దినము ఆశౌచము.

వా॥ పుత్రవిషయే పితుర్మాసా దూర్ధ్వం సంవత్సర పర్యంతం త్రిరాత్రం తదూర్ధ్వంతు స్నానమాత్రం ఏకరాత్రమితి కేచిద్వదంతి అకృతక్రియే పుత్రే సంవత్సరాదూర్ధ్వమపి త్రిరాత్రమస్తి॥

తా॥ పుత్రుడు మరణించినపుడు ౧౦ దినములకుపైన సంవత్సరములోపల వినినయెడ తండ్రికి మూడుదినములాశౌచము. అటుపిమ్మట వినినయెడ స్నానమాత్రమని కొందరును ఒకరాత్రియని మరికొందరును వచించిరి. పుత్రునికి పరలోకక్రియలు జరగనియెడ సంవత్సరానంతరముగూడ తండ్రికి మూడు దినములు సూతకము.

వా॥ సాపత్న్యమాతృమరణె సంవత్సర పర్యంతం త్రిరాత్రం సంవత్సరాదూర్ధ్వం యావజ్జీవంపక్షిణీ । తస్యాఅకృతక్రియత్వే అనపత్యత్వేచ సంవత్సరా దర్వాగ్దశరాత్రం, తదూర్ధ్వంత్రిరాత్రం ఇదంచసాపత్న్యమాతురాశౌచం త్రింశద్యోజన దేశవ్యవధానేపిభవతి॥

తా॥ సవతితల్లి మరణించినపుడు ౧౦ దినములకుపైన సంవత్సరములోపల పుత్రునకు మూడుదినములాశౌచము. సంవత్సరమునకుపైన ఎప్పుడువినినను పక్షిణ్యాశౌచము, సవతితల్లికి సంతానములేక పరలోకక్రియలు జరగకుండునపుడు, సంవత్సరములోపలవినినను ౧౦ దినములు సూతకము సంవత్సరమునకుపిమ్మటవినినయెడమూడు దినములు. ఈసవతితల్లి ఆశౌచము ముప్పదియామడ దూరమునుండి వినినను కర్తలను విడువనేరదు.

వా॥ మాతాపిత్రోర్మరణె తయోరకృతక్రియత్వేచ యావజ్జీవందశరాత్రం । కృతక్రియత్వేతు వింశతి వర్ష పర్యంతం దశరాత్రం । తదూర్ధ్వంతుత్రిరాత్రం । దశాహామధ్యే శ్రుతంచేత్తచ్ఛేషేణశుద్ధిః॥

తా॥ తల్లిదండ్రులు చనిపోయినపుడు వారికి ప్రేతక్రియలు జగగనియెడ తాను బ్రతికియుండు కాలములో నెప్పుడువినినను ౧౦ దినములాశౌచము పట్టవలెను. ప్రేతకృత్యములు జరిగినయెడ ఇరువది సంవత్సరములలోపల నెప్పుడువినినను, పదిదినముల సూతకము. అటుపిమ్మట వినినయెడ మూడుదినములు మరణించిన పదిదినములలోపల వినినయెడ మిగిలిన దినములయందు మాత్రమే సూతకము.

## అనేకాశౌచ సన్నిపాతాశౌచ నిర్ణయము.

వా॥ సమయోస్సజాతీయయో శ్చాశౌచయోః పౌర్వాపర్యేణ సన్నిపాతే పూర్వాశౌచకాలేనైవశుద్ధిః । విషమకాలయోస్సజాతీయయోరాశౌచయోస్సన్నిపాతే పూర్వంవాపరంవాయ దధికకాలం తేనైవశుద్ధిః అల్పమపి పూర్వాశౌచ ముత్తరాశౌచార్ధాధిక కాలం చేదల్పేనైవశుద్ధిః॥

తా॥ సమానకాలము గలవియు, ఒక్కజాతిగలవియునగు ఆశౌచము నేకకాలంబున వచ్చినయెడ మొదటిదానినిమాత్రి మవలంబించవలయు, రెండవది అక్కరలేదు. ఒక్కజాతిగల సూతకములే యెచ్చుతక్కువ కాలము గలిగియుండిన, ఎక్కువ కాలముగల సూతకమునుమాత్రి మవలంబింపవలయు, మొదటవచ్చిన సూతకము కొంచెము గాలముగలదైనను, రెండవసూతకముయొక్క సగముకాలమునకు గొంచెమెక్కువ కాలము గలిగియుండిన, మొదటవచ్చిన యల్పాశౌచమునే పట్టవలయు.

వా॥ విజాతీయ యోర్యోగే సమేన వాధికేన వాశావేన శుద్ధిః సూతిరధిక కాలాచేత్సూత్యాశౌచేనశుద్ధిః॥

తా॥ జాత, మృతసూతకములొక్కటూరి వచ్చినపుడు, మృతసూతకము సమానతాధిక్యములు గలదైనను మృతసూతకమునే అవలంబించవలయు, జాతాశౌచమధిక కాలము గల్గియుండిన, జాతమునేపట్టవలయు,

వా॥ పూర్ణాశౌచస్యదశమధ్యేపునః పూర్ణాశౌచాంతరే ప్రాప్తే పూర్వస్మాత్పూర్ణాశౌచా దూర్ధ్వ ముత్తరాశౌచం దినద్వయం కుర్యాత్ దశమదినస్య అష్టమయామే సూర్యోదయా దర్వాగన్యస్మిన్

పూర్ణాశౌచే ప్రాప్తే పూర్వస్మాదూర్ధ్వం దినత్రయ ముత్తరాశౌచం కుర్యాత్ । మాతాపితృ మరణాశౌచస్య ఆశౌచాంతరేణయోగే పూర్వేణవాపరేణవా మాతాపిత్రోరాశౌచేనశుద్ధిః॥

తా॥ పూర్ణాశౌచముయొక్క పదియవ దినంబున వేఱొక పూర్ణాశౌచము కలిగినయెడ, మొదటిదిపూర్తిఅయిన వెనుక రెండవదానికి రెండుదినములు సూతకము పట్టవలయును, దశమదినాపరాహ్ణమందు సూర్యోదయమునకు బూర్వమింకొకటి కలిగినయెడ పిమ్మట రెండుదినములు పట్టవలయును, తలిదండ్రుల మరణాశౌచమధ్యమునందైనను, లేక వారిమరణమునకు ముందైనను, వేఱొకసూతకము గలిగినయెడ, మాతాపిత్రాశౌచమును మాత్రమే పట్టవలయును.

వా॥ గార్హపత్యదహన నిమిత్తసూతాశౌచం తత్స్యాశౌచాంతరేణ యోగే దహనస్యశుద్ధిః॥

తా॥ దహనము చేసినదానికి గలిగినసూతకము దహనసూతకమధ్యమున ఇంకొక సూతకము గలిగినయెడ మొదటిదానితో శుద్ధికలుగుచున్నది.

వా॥ మాతాపిత్రోః పుత్రజన్మనిమిత్తాశౌచస్య ఆశౌచాంతరేణ యోగే పుత్రజననాశౌచేనశుద్ధిః ॥ పుత్రజననస్యైనమేవ। పితుః ప్రేతసంస్కర్తృత్వేతు పూర్వేణ వాపరేణవా ప్రేతాశౌచేనైవపుత్రజననా శౌచస్యనివృత్తిః । అసంస్కర్తృత్వేతు మృతాశౌచ మపి జననా శౌచేనశుద్ధ్యతి కేచిత్తు సంస్కర్తురపిపుత్రజననా శౌచమేవప్రబలమిత్యాహుః॥

తా॥ తల్లిదండ్రులకు బుత్రజనన సంబంధమగు పురుడు కలిగి యుండునపుడు వేఱొకటివచ్చినయెడల మొదటి దానినిమాత్రమే అవలంబింపవలయు, పుత్రుని జననమునందును నైప్రకారమే, తండ్రికి ప్రేతసంస్కారమును జేయునప్పుడుగాని అంతకుముందుగాని పుత్రజననాశౌచము గలిగినపుడు ప్రేతసూతకమును మాత్రమే అవలంబింపవలయును, ప్రేతకృత్యముల నొనర్చక ఆశౌచమును మాత్రము పట్టియుండునపుడు పుత్రుడుగలిగినయెడ మొదటి దానినివిడచి జాతాశౌచమును పట్టవలయును, ప్రేతసంస్కారములనొనర్చు వానికిని పుత్రజననాశౌచము ప్రబలమనికొందరు వచించెదరు.

వా॥ పితృమరణాశౌచమధ్యేమాతృమరణే పితుర్దశాహాదూర్ధ్వంమాతుః పక్షిణీంకుర్యాత్। పితుస్సన్న్యాసేదుర్మ్మరణే వానపక్షిణీ। కింతుమాతృ మరణాదారభ్య పూర్ణమేవాశౌచం కుర్యాత్॥

తా॥ తండ్రిమరణించిన సూతకముగలిగి యుండునపుడు తల్లిమరణము గలిగినయెడ, మొదటిసూతకము తీరినవెనుక రెండవదానికి ౧౪ దినము సూతకమునుపట్టవలయు. తండ్రిసన్న్యాసియై మరణించినను దుర్మ్మరణమునొందినను సూతకముపట్టక మాతృమరణదినము మొదలు సంపూర్ణసూతకము పట్టవలయు.

వా॥ మాతృమరణాశౌచమధ్యే పితృమరణేపితుః పూర్ణామేవాశౌచంకుర్యాత్। అనుగమనేతు దినాంతరమరణేపి మాతుఃపక్షిణీనభవతి। కింతుతత్రతంత్రేణైవశుద్ధిః। అనుగమనం వినాదైవాన్మాతృమరణే పక్షిణీభవతి। సాచదశమదినాత్ప్రాగేవ పితుర్దశమదినే మాతృమరణేతు దినద్వయా[illegible]ంభవతి। అత్రపక్షిణీమధ్యేదినద్వయమధ్యేచ పితురేకాదశేహన్యేవస్వతంత్రైకోద్దిష్టంకుర్యాత్। కర్తుస్తాత్కాలికీ శుద్ధిరస్తి॥

తా॥ తల్లిమరణసూతకము గలిగియుండునపుడు తండ్రిమరణము జరిగినయెడ, మొదటిదానిని వదలి రెండవదానిని సంపూర్ణముగ వలంబించి తండ్రికి క్రియలొనర్చినపిదప తల్లికి ౧౪ దినము సూతకముపట్టి క్రియలొనర్చవలయు, తల్లియనుగమనముచేసి తండ్రితోగూడ మృతినొందినను, ఇంకొకదినమున మృతినొందినను, ఈ ౧౪ దినము గూడ అక్కరలేదు - తంత్రమువలన శుద్ధిగలుగును, పితృమరణమునందను గమనము చేయక, తొమ్మిదిదినములలోపల దైవయోగమువలన తల్లిమృతినొందినయెడ, తండ్రికి క్రియలొనర్చిన వెనుక తల్లికి ౧౪ దినము సూతకముపట్టి క్రియలొనర్చవలయు, తండ్రిచనినపదియవనాడు తల్లిమరణించినయెడ, రెండుదినములు పట్టవలయు, మాతృవిషయమైచెప్పిన రెండువిధులయందును, తాత్కాలికశుద్ధిగలదు గనుక, తండ్రికి ఏకాదశాహమునందే, ఏకోద్దిష్టమును స్వతంత్రముగ నేచేయవచ్చును.

వా॥ పితృమరణాశౌచమ[illegible] దేశాంతరగత మాతృమరణశ్రవణే మాతేరికృత్యక్రియాయామభావోతంత్రేణశుద్ధిః। అకృతక్రియాయాంతు పితృదశాహాదూర్ధ్వంమాతుః పక్షిణీంకుర్యాత్।

తా॥ తండ్రి మరణసూతకము గలిగియుండునపుడు; పరదేశమునందు తల్లిమరణము జరిగినట్టు తెలిసి, యాతల్లికి ప్రేతక్రియలు జరిగియుండిన, రెంటికిని తంత్రముల వలన శుద్ధి గలుగును. తల్లికి క్రియలు కాకుండినయెడ, తండ్రియొక్క పదిదినములు తీరినవెనుక తల్లికి ౧౪ దినము సూతకము పట్టవలయు.

వా॥ మాతృమరణాశౌచమధ్యే దేశాంతరగత పితృమరణ శ్రవణే శ్రవణప్రభృతి దశాహంపిత్రాశౌచంభవతి॥

తా॥ తల్లి మరణసూతకము గలిగి యుండునపుడు, పరదేశమున దండ్రిమరణము జరిగినట్టు వినినయెడ నదిమొదలుకొని పదిదినములు తండ్రికిసూతకము పట్టవలయు.

వా॥ దేశాంతరగత యోర్మాతాపిత్రోర్మరణే యుగపచ్ఛ్రుతే తంత్రేణశుద్ధిః॥

తా॥ తల్లిదండ్రులు పరదేశముననేక కాలంబున మరణించిరని వినినయెడ రెంటికిని తంత్రమువలన శుద్ధి గలుగును.

వా॥ అతిక్రాంత వర్తమానయో[illegible]పాతే వర్తమానేనా తిక్రాంతస్యశుద్ధిః। అతిక్రాంతస్య కాలాధిక్యే త[illegible]క్రాంతేనైవ వర్తమానస్యశుద్ధిః ఏవం దాహకస్యాతిక్రాంతాశౌచేనైవ వర్తమానస్య శుద్ధిః। మాతృవిషయేతు నాయంవిధిః। కింతుపూర్వోక్తమేవపూర్ణం॥

తా॥ అతిక్రాంత వర్తమానాశౌచము లేక కాలంబున గలిగినయెడ, వానిలో నధిక కాలముగలదాని నవలంబించ వలయు; దాహకునకు అతిక్రాంతము సంభవించిన యెడ, వర్తమాన సూతకముపనిలేదు. తల్లిదండ్రుల విషయమైయట్లుగాక, పూర్వోక్త ప్రకార మాచరింపవలయు.

దేశాంతర లక్షణము.

శ్లో॥ దేశాంతరం వదంత్యన్యే షష్టియోజన మాయతం చత్వారింశద్వదంత్యన్యే త్రింశదన్యే తథైవచ॥

తా॥ దేశాంతరమనగా, అరువదియామడ వ్యవధానముగలది అని కొందరును, నలువదియని కొందరును, ముప్పదియని కొందరును వచించిరి. [illegible] గ్రహింతురు. (కొంచెము [illegible] మహానదులు పర్వతములు [illegible] దేశాంతరమనబడును.)

## అధికమాసమృతస్య ఆద్యశ్రాద్ధనిర్ణయము.

అధికమాసమృతునకు అధికమాసమునందు దహనాది దశాహాంతమునకు జరిగించి ఏకాదశాహస్సునందు ఆద్యశ్రాద్ధమును ప్రకృతిగా జరిగించి షోడశశ్రాద్ధములు జరిగించవలెను. నిజమాసమునందు మృతతిథియందు అన్వాద్యమాసికమును పార్వణవిధిగా జరిగించి ఆ నిజమాసమునందే "మాసన్యూనే ష్యూనమాసికమితి" శాస్త్రవిహితకాలముల యందు ఊనమాసికమును జరిగించవలెను. ద్వితీయానుమాసికము నిజమాసమునకు రెండవ మాసమునందు జరిగించవలెను. ఏకాదశాహస్సునందు షోడశసంకల్పమునందు విశేషము ద్వితీయానుమాసిక, తృతీయానుమాసిక... అద్యాన్వాద్యాభ్యాం సహాయుగపద్ద్యకరిష్యే యని చెప్పవలెను. శేషము ప్రకృతిగానే చేయవలెను.

## అధికమాసే త్రైపక్షికాదినిర్ణయము.

మృతమాసమునకు ద్వితీయమాసము అధికమైతే అధికమాసమునందే త్రైపక్షికమును జరిగించవలెను, ఆఱవమాసమధికమైతే అధికమాసమునందే ఊనషాణ్మాసికమును జరిగించవలెను. పన్నిండవమాసమధికమైతే అధికమాసమునందే ఊనాబ్దికమును జరిగించవలెను. ౧౩ మాసమధికమైతే అధికమాసమునందే ప్రథమాబ్దికమును జరిగించవలెను. నిజమాసములయందు త్రైపక్షిక, ఊనషాణ్మాసిక, ఊనాబ్దిక, ప్రథమాబ్దికములు తిరిగి జరిగించకూడదు.

మఱియొకవిజ్ఞాపనము.—బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో- కలిప్రాబల్యంబున సకాలంబున నుపనయనము చేయలేకపోవుచున్నారు. ఇది యిట్లుండగనిందు- దైవాధీనమువలన ఉపనయనకాలము అతిక్రమించి 12-16-20సం॥ ప్రాయమందు మరణించుచున్నవానిని గుఱించి కొంచమువిచారింతము. (శ్రాద్ధమయూఖే॥ వసిష్ఠః॥) శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాం సంస్కారరహితామృతాః । పరలోకాదికంనైవ పిశాచత్వంప్రపద్యతే॥ సంస్కారహీనాయేమర్త్యాః ప్రమీతాఃకాలయోగతః । తేషాంసంస్కరణం కార్యమమంత్రకమితిస్మృతమ్ । దహనాదిక్రియాభావే పిశాచాస్సుర్నసంశయః॥ అనియుండుటవలన, ఆ ప్రేతకు వేదమంత్రవర్జితముగా ప్రేతక్రియలన్నియుచేసియే తీరవలెను గాని మానుకొనుటకర్తకు శ్రేయస్కరమైనదిగాదు. శూద్రులలోకూడా వివాహములేక మరణించునప్పుడును వయస్సు 16సంవత్సరములు దాటినప్పుడును ప్రేతత్వనివృత్తికొఱకు ప్రేతక్రియలన్నియు నొకరోజుననేజరిపి - కర్తశుద్ధి స్నానముచేయవలెననియు, అప్పుడు ౧౨ దినములు దాటినపిమ్మట ౧౬ దినములలో కర్మచేయవలయునని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. తత్ప్రమాణము కాత్యాయనః॥ శ్లో॥ షోడశోర్ధ్వమ్మృతాయేస్యు రవివాహితపాదజాః । తేషాంపంచదశాహేవా తదర్వాగ్వాయథావిధి॥ ప్రేతకార్యంప్రకర్తవ్యమితి ముద్గలసమ్మతమ్॥

గ్రంథశ్చాయం సమాప్తః.